# శ్రీ రామ పాదయాత్ర

## అయోధ్య నుండి శ్రీలంక




రామ చరిత వినిన రామనామ మనిన
తొలగు పాప చయము కలుగు ముక్తి
రామ పాదయాత్ర రమణీయ చరితంబు
కనిన వినిన తీరు కామితములు

# శ్రీరామ పాదయాత్ర

రచన :

డా. పప్పు వేణుగోపాలరావు

ప్రచురణ :

భాగవత తత్త్వ ప్రచార సమితి

కడప

# పుస్తకం చదివే ముందు...

అమెరికాలో సిరక్యూజ్ యూనివర్సిటీలో Prof. Daneil Smith అనే ఆయన అమెరికన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్ వారి ఉపకార వేతనంతో భారతదేశం వచ్చేడు. ఆయనకు రామాయణం మీద ఎనలేని మమకారం. శ్రీరాముడు అయోధ్యనించి లంకకు వెళ్లేడు కదా, ఆ మార్గాన్ని అన్వేషించి అక్కడికి వెళ్లి అవెలా ఉన్నాయో ఆ స్థలాలు చూసి వద్దామను కున్నాడు. జనశ్రుతిలో వేలాది సంవత్సరాలుగా ఉన్న ఆ స్థలాలన్నిటికీ వెళ్లేడు. ఫోటోలు తీసేడు. అవి స్లైడ్సుగా మార్చి నాకో సెట్ ఇచ్చేడు. సుమారు 200కు పైగా ఉన్న స్లైడ్సుని చూసి నాలో ఒక ఆలోచన రేకెత్తింది. ఈ చిత్రాలతో పాటు వాల్మీకి శ్లోకాలు, తెలుగు రామాయ ణాల్లో పద్యాలు జోడించి మనం కూడా రామ పాదయాత్ర చేసి చూస్తే అని పించింది. 70 స్లైడ్సు ఎంచుకుని వాటితో ఉపన్యాసం జోడించి అనేక చోట్ల భారతదేశంలోను, అమెరికాలోను ఇచ్చేను. ప్రజలు ఆనంద బాష్పాలతో అశ్రుధారలతో అచంచల భక్తి విశ్వాసాలతో విని తిలకించి పులకించేరు.

మద్రాసులో డా. పద్మా సుబ్రహ్మణ్యం గారు 1991 రామనవమికి నాచే ఈ ఉపన్యాసం ఇప్పించేరు. శ్రోతల్లో కూర్చున్న మిత్రులు శ్రీ మంటపంపల్లి రమణారెడ్డిగారు ఇది చిన్నదైనా గొప్ప పుస్తకం అవుతుంది అన్నారు. సరే అన్నాను. ఆ అభ్యర్థన ఈ రూపాన్ని దాల్చింది. బొమ్మ లన్నీ వేసి పుస్తకం వెయ్యడం చాలా ఖర్చుతో కూడిన పని, స్థాలీపులా కంగా ఓ నాలుగు వేసేం. చదివి, తిలకించి ఆనందించండి. ఇందులో పూర్తి రామ కథ దొరుకుతుందనుకోవద్దు. దీని గమ్యం వేరు, పరిధి వేరు.

మీ
**పప్పు వేణుగోపాలరావు**

కీ॥ శే॥ పి. శివరామ రెడ్డి

ఒంటిమిట్ట కోదండరామాలయ ధర్మనిర్వహణాధికారి



చిత్తమందు భక్తి శివరామ రెడ్డికి
ఒంటిమిట్ట యనిన కంటి వెలుగు
కీర్తి శేషుడైన ఆర్తియాతనికాత్మ
శాంతినిమ్ము రామచంద్ర ! వరద !

# విజ్ఞప్తి

మా ఒంటి మిట్ట రామాలయంలో రాములవారికే శ్రీమద్భాగవతాన్ని పోతనగారు అంకితం ఇచ్చేరని కొందరంటారు. అది అనాదిగా ఆ ప్రాంతాల ప్రజల విశ్వాసం. దానికి తోడు అట పోతనగారి బొమ్మ దాని క్రింద వారి 'ఇమ్మను జేశ్వరాధముల.... పద్యం ఉన్నాయి. పోతనగారి పేరిట ఇంకా ఎన్నో ఉన్నాయి. స్థల పురాణాల్లో శ్రీరాముడిక్కడ సీతమ్మ వారికి దాహాన్ని తీర్చడానికి పాతాళగంగను తెచ్చేడని చెప్తారు. దాన్నే ఇప్పుడు రామ తీర్థం అని ఈ నాటికీ ప్రజలు సేవిస్తున్నారు. మండు వేసవిలో కూడా ఇక్కడ నీరింకదు. అంతేకాక జాంబవంతుని ప్రతిష్ఠగా ఏకశిలలో రాముడు సీతాలక్ష్మణ సమేతుడై ఇక్కడ వెలసేడు. అందువలనే నేమో ఈ ఏకశిల కారణంగా ఈ ఊరు ఒంటిమిట్టి అయింది. ఇటీవల కాలంలో శ్రీవావిలకొలను సుబ్బారావుగారు ఇక్కడే మందరం అనే పేర రామాయణం వ్యాఖ్యానించేరు. ఇన్ని కారాణాలవల్ల రాముడు అందరిలాగే మా వాడు అందుకనే భాగవత తత్త్వ ప్రచార సమితి తరఫున ఈ రామ పాదయాత్రని ముద్రించుతున్నాం.

దీని రచయిత శ్రీ పప్పు వేణుగోపాలరావు గారికి మా కృతజ్ఞతాంజలులు. హైద్రాబాదు వాస్తవ్యులు ప్రస్తుత కేలిఫోర్నియా నివాసి శ్రీ ఏటూరి రామరెడ్డిగారు ఈ రచనకు హార్దిక సహాయం అందించారు. వారికి మా నివాళి.

పి. వి. రమణారెడ్డి
భాగవత తత్త్వ ప్రచార సమితి
కడప

# RAMA PADA YATRA

Unfathomable indeed is Ramayana as much as the perception of 'Rama' himself. It is the very substratum of the sum total of the collective cognizance of the kaleidoscopic facets of profound culture, cultivated during the course of several thousands of years. It is poetry unparallelled to the literates, drama unsurpassed for the artistes, dharma, unequalled for the refined, knowledge unerring for seekers, be it history, geography, ethnology, astronomy, music or warfare. It is perhaps the first kavya that bound the whole Indian sub-continent, through the happenings in the story and, till today, retold and enlivened by scholars, artists, singers, bards and actors. Ramayana is an unmistakable symbol of unity of our culture, in thought, word and action. When our Director K. Subrahmanyam Memorial Trust and Narada Gana Sabha celebrated prayerfully the Ramayana Saptaham as a Seven Day Ramayana Natya Utsav, we had the privilege of organising lectures on various aspects of Ramayana through varied linguistic sources. One of the high lights, was a lecture by Dr. Pappu Venugopala Rao, on "Rama Pada Yatra" an unusual topic - so distantly removed to the days of Rama, yet so tightly tied to our own times. In his own unique, scholarly, yet communicative style, Dr. Rao described the course of the travel of Rama from Ayodhya to Lanka with geographic and photographic correlation that, one experienced a transformation of time and a sense of participation in the very tour of the Lord. Yes, the lecture convinced the timeless nature of Rama and his life, His percolation in the length and breadth of this Motherland of ours. His travel from Ayodhya - which Dr. Rao explained as the place where there is no Yuddha [war] to the land where He had to wage a war to destroy evil forces and protect the good, reveals the purpose of the Avatara. The slides demonstrated the identity of the places, and the undying contemporary affinity with the incidents through oral traditions the people of these respective regions still reverentially experience with a sence of historicity. The presently known states of Uttar Pradesh, Madhya Pradesh, Maharashtra, Karnataka, Andhra and Tamilnadu are covered

in the Divya Kshetras which have been photographed so religiously and beautifully by an American enthusiast, Daniel Smith, who has not excluded even maps. The palaces of Dasaratha, Kaikeyi, Seetha, Kausalya, the relevant inscriptions, foot prints of Sri Rama, Bharadwaja Ashrama, Bharat Milap where Rama gives His sacred Paduka and kissed Bharata, Atri Ashrama, Agastyashrama, Panchavati, Hanuman's birthplace, Gandhamadhana Parvata where the Vanaras assembled the place where Vibhishana surrendered and Sethu where Rama worshipped are all some of the unforgettable slides, which were a delight to the sense of sight with the intellectual, emotional and spiritual overtones quoted and explained from Ramayana by Dr. Venugopala Rao.

I am sure that this small book will kindle the noble desire of traversing the terrain of Rama Pada Yatra, not only physically but in spirit and realise the indivisible spiritual unity of our culture and the true meaning of life.

**Dr. Padma Subrahmanyam**
Director, Nrityodaya, Madras - 600 002

29-10-91.

## అంకితం

తల్లి దండ్రి నీవు, ధర్మమూర్తివి నీవు
సఖుడు గురుడు నీవు, సత్యమీవు
నీదు పాదయాత్ర నీకె అంకితమిత్తు
నందుకొనుము రామ ! అవధరించి !

డా. పప్పు వేణుగోపాలరావు

# అయోధ్య నుంచి - లంక వరకు




రాముడు నడిచిన త్రోవ

శ్రీ

# శ్రీరామ పాదయాత్ర

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం ।
ఆరూహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥

వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ ।
శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయమ్ ॥

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః ॥

భారతదేశము పవిత్ర సంస్కృతి గల గొప్ప దేశము. మన సంస్కృతిలో మొదటి లౌకిక కావ్యము శ్రీమద్రామాయణము. భారత భాగవతములు ఈ సంస్కృతీ లతకు పుష్పించిన పరిమళ భరిత కుసుమములు. రామాయణంలో ఒక మానవుడు, ఒక వానరుడు, ఒక రాక్షసుడు కూడా ఏ విధంగా ఉన్నతస్థితికి ఎదగగలరో తెలుస్తుంది. మానవ వ్యక్తిత్వ వికాసానికి రామాయణం, సాంఘిక జీవన వికాసానికి భారతం, ఆధ్యాత్మిక, నైతిక వికాసానికి భాగవతం ఆర్యులు మనకందించిన అమృత కలశాలు.

నారద మహర్షితో వాల్మీకి తన గ్రంథానికి ఎటువంటి కథా నాయకుడు కావాలో, అతనిలో ఎట్టి గుణగణాలుండాలో చెప్పాడు. అటువంటి వాడెవడు అని అడిగేడు.

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్ ।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో ధృఢవ్రతః ॥

చారిత్రేణచ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।
విద్వాన్ కః సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః ॥

ఆత్మవాన్ కః జితః క్రోధః ద్యుతిమాన్ కోనసూయకః ।
కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోషశ్చ సంయుగే ॥

అని అడిగేడు.

అంటే -

గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మతత్పరుడు, కృతజ్ఞుడు, సత్య వాక్య పరిపాలకుడు, ధృడసంకల్ప చిత్తుడు ఎవరు ?

చరిత్ర సృష్టించ గలిగిన వాడు, సర్వప్రాణులకును ప్రియమైన వాడు, విద్వాంసుడు, సమర్థుడు, చూడదగిన శుభలక్షణములు కలవాడు ఎవడు ?

ఇంద్రియములను జయించినవాడు, కాంతివంతమైన వాడు, అసూయ లేనివాడు, ఎవడు ? ఎవడికి కోపం కలిగితే దేవతలు కూడా అతనితో యుద్ధం చేయడానికి భయపడతారో అలాటి వాడెవడు ? – అని వాల్మీకి నారదుణ్ణి అడిగేడు. ఆయన 'శ్రీరాముడు' అన్నాడు నారదుడు.

విష్ణు సహస్రనామంలో పార్వతి శివుణ్ణి 'స్వామీ ! ఏవిధంగా ఈ వెయ్యి నామాలు పఠించకుండానే అంతటి పుణ్యం కలుగుతుంది' అని అడిగింది. శివుడు పార్వతితో -

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్ర నామతః తుల్యమ్ రామ నామం వరాననే ॥

– అన్నాడు. 'శ్రీరామ' అన్న ఒక్క నామం వెయ్యి నామాలకు సరియైనది అని చెప్పేడు. శ్రీరామ నామ మహిమ అంతటిది.

ఆ శ్రీరాముడు పట్టాభిషేకానికి సన్నద్ధుడౌతున్న తరుణంలో ఆయన వనవాసం చెయ్యవలసి వచ్చింది. అయోధ్య నుండి లంక వరకు ఆయన నడచిన త్రోవతో భారత ధాత్రి పునీతమైంది. శ్రీరాముని వెంట సీత, లక్ష్మణుడు అడవులకు వెళ్లేరు. ఆ శ్రీరాముడు నడచిన త్రోవనే నడిచి ఆయా ప్రదేశాలలో జరిగిన విషయాలను స్పృశిస్తూ రామపాదయాత్రను ఊహా నేత్రంతో, మనః చక్షువుతో సందర్శించి తరించడమే ఈ గ్రంథోద్దేశం.

శ్రీరాముని వనవాసం అయోధ్యతో ప్రారంభమై అయోధ్యతో ముగిసింది. కనుక ఆ అయోధ్య నుండే ప్రారంభిద్దాం. వాల్మీకి, రామ జన్మభూమి అయిన అయోధ్యను ఇలా వర్ణించేడు -

కోసలో నామ ముదితః స్ఫీతో జనపదో మహాన్ ।
నివిష్టః సరయూతీరే ప్రభూత ధనధాన్యవాన్ ॥

అయోధ్యానామనగరీ తత్రాసీత్ లోకవిశ్రుతా ।
మనునా మానవేంద్రేణ యాపురీ నిర్మితాస్వయమ్ ॥

సరయూనది ఒడ్డున ఉన్న కోసలదేశానికి అయోధ్య రాజధాని. ధన ధాన్యాలతో తులతూగుతున్న ఆ నగరాన్ని మనువు స్వయంగా నిర్మించేడు.

పుత్రులులేని దశరథుడు పుత్రకామేష్ఠి యాగం చేసేడు. శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు కలిగేరు. జనక మహారాజు కుమార్తెలను వారు వివాహం చేసుకున్నారు. అయోధ్యలో ఈ నాటికీ సీతారాముల భవనం ఉంది. దాని పేరు 'కనకమహల్'. తెల్లవారితే శ్రీరామునికి పట్టాభిషేకం అనగా దశరథుడు కైకేయి మందిరానికి వెళ్లేడు. కైకేయి కోరిన రెండు కోర్కెలు దశరథుడు అంగీకరింపక తప్పలేదు. సుమంత్రుడు కైకేయి మందిరం నించి సీతారాముల భవనానికి వెళ్లేడు. ఆయన శ్రీరాము నితో ఇలా అన్నాడు -

కౌసల్యాసుప్రజారామ ! పితా త్వాం ద్రష్టు మిచ్ఛతి ।
మహిష్యాసహ కైకేయ్యా గమ్యతాం తత్ర మా చిరమ్ ॥

'కోసలదేశ ప్రజలకు ప్రీతి పాత్రుడవైన శ్రీరామా! కౌసల్య కుమారుడవైన రామా! మీ తండ్రి కైకేయి మందిరంలో ఉన్నాడు నిన్ను వెంటనే చూడాలని కోరుకుంటున్నాడు. నీవు వెంటనే అక్కడికి వెళ్ళు' అన్నాడు సుమంత్రుడు.

శ్రీరాముడు సుగుణాలకు ఆలవాలమైనవాడు. వెంటనే కైకేయి మందిరానికి వెళ్లేడు –

తత : పృథివ్యాం గృహవరం మహేన్ద్ర భవనోపమమ్ ।
రాజపుత్ర: పితుర్వేశ్మ ప్రవివేశ శ్రియాజ్వలన్ ॥

ఇంద్రభవనంలా ఉన్న కైకేయి మందిరానికి రాముడు వేళ్లేడు. వెళ్ళి -

స పితుశ్చరణే పూర్వం అభివాద్య వినీతవత్ ।
తతో వవన్దే చరణౌ కైకేయ్యాః సుసమాహిత : ॥

ముందుగా తండ్రికి పాదాభివందనం చేసేడు. తరువాత కైకేయి చరణాలకు ప్రణమిల్లేడు. కబురంపినవాడు తండ్రి. కాని ఆయన మాట్లాడే స్థితిలో లేడు. 'ఏమమ్మా! నాతండ్రి పలుకడు? నేనేమైనా అపరాధం చేసేనా?' అని శ్రీరాముడు కైకేయిని అడిగేడు. ఆమె అంది - ఆయన నీతో చెప్పాలనుకున్నది నే చెప్తాను విను - అని -

అనుదేశే పితుస్తిష్ఠ యథానేన ప్రతిశ్రుతమ్ ।
త్వయారణ్యం ప్రవేష్టవ్యం నవ వర్షాణి పంచచ ॥

భరతశ్చ అభిషిచ్యేత యదేతదభిషేచనం ।
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ ॥

నీవు పధ్నాలుగేళ్లు వనాలకు పోవాలి. నీకు కావలసిన పట్టాభిషేకం భరతుడికి కావాలి - అంది.

భారతీయ భాషలలో అనేక రామాయణాలున్నాయి. ఉత్తర హిందూస్థానంలో 'రామచరితమానస్' తులసీదాసు రచన ఎంత ప్రజాదారణ పొందిందో దక్షిణాన తమిళంలో కంబరామాయణం అంత ప్రజాదరణ పొందింది. కంబన్ ఈ సందర్భంలో ఏమన్నాడంటే -

ఏయ వరంగళ్ ఇరండిన్
ఒన్రివాల్ ఎన్ సేయ్ అరసు ఆళ్వదు
సీతై కేళ్వన్ ఒన్రాల్ పోయ్ వనమాళ్వదు....

నా రెండు వరాలలో ఒకటి నా కొడుకు రాజు కావడం. రెండోది సీతమగడు వనాలకు పోవడం - అని

అయితే కైకేయి కేవలం గమ్యం లేకుండా వనాలకు పొమ్మనలేదు. ఆవిడ ఏం చెప్పిందంటే....

సప్తసప్తచ వర్షాణి దండకారణ్య మాశ్రితః ।
అభిషేక మిదం త్యక్త్వా జటాచీరధరో భవ ॥

భరతః కోసలపతేః ప్రశాస్తు వసుధామిమామ్ ।
నానారత్న సమాకీర్ణాం సవాజి రథకుంజరామ్ ॥

పధ్నాలుగేండ్లు నువ్వు దండకారణ్యానికి వెళ్లు. ఈ అభిషేకాన్ని వదలి నార చీరలు ధరించు. భరతుడు నానా రత్నములతోను, ఏనుగులతోను, గుర్రాలతోను సుసంపన్నమైన కోసలదేశాన్ని పరిపాలిస్తాడు - అంది. దండకారణ్యానికి వెళ్లమని ఆవిడ ఆదేశించడంలో ఉద్దేశం సూక్ష్మంగా ఆలోచిస్తే రాక్షస నిర్మూలనం చెయ్యడానికి అని తెలుస్తుంది.

శ్రీరాముడు ఈ మాటలు విని ఎలా ప్రవర్తించేడు? ఆయన స్థితప్రజ్ఞుడు. అంటే సుఖాలకు పొంగిపోడు, కష్టాలకు క్రుంగిపోడు. అందుకని కైకేతో అన్నాడు –

అనుక్తోపి అత్రభవతా భవత్యా వచనాదహం
వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ

భరతః పాలయేద్రాజ్యం శుశ్రూషేత్ చ పితర్ యథా
తథా భవత్యా కర్తవ్యం సహి ధర్మః సనాతనః

స రామం పితరం కృత్వా కైకేయీంచ ప్రదక్షిణం
నిష్క్రమ్య అన్తఃపురాత్ తస్మాత్....

'తల్లీ! నీవు చెప్పినట్లుగానే నేను పధ్నాలుగేళ్లు వనాలకు వెళతాను. సనాతన ధర్మానుసారంగా తల్లిదండ్రులను సేవిస్తూ భరతుడు రాజ్యం పరిపాలించు గాక!' అని చెప్పి తండ్రికి, కైకేయికి ప్రదక్షిణం చేసి అన్తఃపురం వదలి వెళ్లిపోయేడు రాఘవుడు.

అక్కడ కైక అలా ప్రవర్తించటానికి కారణం ఏమిటి? కేవలం తన కొడుకు భరతుడు రాజు కావలనా? కానేకాదు. ఆమె రాముని అవతారాన్ని, ఆయన అవతారపరమావధిని తెలిసిన జ్ఞాని. ఆమె కపట నాటకం ఆడి, క్రోధాన్ని నటించి రాముని అడవులకు పంపుతుంది. అందుకే

రాముడు కైకతో తన కృతజ్ఞతను చెప్పుకున్నాడని విశ్వనాథ సత్యనారాయణ గారు తమ 'రామాయణ కల్పవృక్షం'లో చెప్పేరు.

రాముడేమన్నాడంటే –

నీ యుపకారమున్ మరువనే మరి యో జననీ! యెవండుగా
నీ యొక సత్కృతిన్ సలుప నీవగు దిందాక రాదు రెవ్వరో
చేయకయే సహాయపడి చేయగరాదును సత్ఫలంబురా
జేయగరాదు లోకమున సేమము త్వాదృశులందు నిల్చెడిన్

ఎవరో ఒకరు ఏదోరకంగా చెయ్యకుండా లోకంలో సత్కార్యాలు జరగవు. లోకంలో నీవంటి వారి వలనే శుభాలు చేకూరుతాయి. నేను నీకు కృతజ్ఞుడను. నీ ఈ ఉపకారాన్ని నే మరువను అన్నాడు.

అలా అని చెప్పి కైకేయి మందిరం వదలి బయటకొచ్చిన శ్రీరాముడు తన తల్లియైన కౌసల్య మందిరానికి వెళ్లేడు. ఆమె తెల్లవారితే తన కొడుకు పట్టాభిషిక్తుడౌతాడనే ఆనందంతో ఉంది. ఆమె దగ్గరకు వెళ్లి రాముడు 'నేను వనవాసానికి వెళుతున్నాను' అని చెప్పి జరిగిన విషయం చెప్పేడు. ఆమె దిగ్భ్రాంతి చెందింది. ఆక్రోశించింది. దుఃఖించింది. ఈ సందర్భంగా వాల్మీకి ఏమన్నాడంటే –

ఏక ఏవ హి వన్ధ్యాయాః శోకో భవతి మానసః
అప్రజాస్మీతి సంతాపో నహి అన్యః పుత్ర విద్యతే

అంటే గొడ్రాలికి ఒకటే బాధ పిల్లలు లేరని. ఇలాంటి బాధలు గొడ్రాలికుండవు. సంస్కృత భాషలో మన సంస్కృతి ఎంత ఉందో జానపదుల నోళ్లలో అంతే సంస్కృతి ఉంది. తరతరాలుగా జానపదుల జీవితంతో ముడివడిన రామాయణాలున్నాయి. అవి వాళ్లు పాడుకునే పాటలు. సంక్షేప రామాయణం అనే పాటలో రాముని వనవాసం మాట విని కౌసల్య ఇలా అందిట –

'నాకేల బుడితివిర ఓ రామచంద్ర!
కైకకు పుడితేను రాజ్యమేలుదువు'

శ్రీరామచంద్రునితో పాటు సీత, లక్ష్మణుడు వనవాసానికి బయల్దేరేరు. రామాయణంలో ఒక అత్యున్నతమైన పాత్ర సుమిత్ర. ఆమెకున్న ఇద్దరు కొడుకుల్ని చెరొకరికి అప్పజెప్పిన త్యాగశీలి. లక్ష్మణుని శ్రీరాముని వెంట, శతృఘ్నుని భరతుని వెంట ఉండమని కోరిన నిస్స్వార్థజీవి ఆమె. వనాలకు బయలుదేరుతున్న లక్ష్మణునితో సుమిత్ర ఇలా అంటుంది –

రామం దశరథం విద్ధి, మాం విద్ధి జనకాత్మజామ్ ।
అయోధ్యాం అటవీం విద్ధి, గచ్ఛ తాత! యథాసుఖమ్ ॥

– రామం అంటే రాముని దశరథునిగా భావించు. జనకుని కుమార్తె అయిన సీతను మాం అంటే నన్నుగా భావించు. అటవీం అంటే అడవిని, అయోధ్యగా తెలుసుకో. నాయనా అలా అనుకుని సుఖంగా వెళ్లిరా! అంది. ఇక్కడ అన్నను, వదినను తండ్రి, తల్లిగా భావించడం అనే ఒక ఉత్కృష్ఠ సంస్కృతి కనిపిస్తుంది. పైకి ఇలా కనిపించే ఈ శ్లోకం వెనుక ఎంతో సుందరమైన అర్థం మరొకటి ఉంది. అదేమంటే –

రామం అంటే శ్రీరాముని, దశ - రథం అంటే పక్షి వాహనం గల వానిగా - గరుడ వాహనారూఢుడైన శ్రీమన్నారాయణమూర్తిగా తెలుసుకో. జనకాత్మజను మాం అంటే లక్ష్మీదేవిగా తెలుసుకో. అడవిని అయోధ్యాం అంటే యుద్ధము చేయరాని, చేసినా గెలువరాని స్థలం అంటే వైకుంఠంగా తెలుసుకో - అని చెప్పింది. ఇంత చిన్నని శ్లోకంలో ఇంత అలతి అలతి మాటలలో ఇంతటి గంభీరమైన అర్థాన్ని ఇమడ్చగలిగినందువల్లనే వాల్మీకి ఆదికవి, ఒక మహాకవి అయినాడు.

శ్రీరాముడు వనవాసానికి బయలుదేరేడు. అతని వెంట సీత, లక్ష్మణుడు ఉన్నారు. ఆ శ్రీరాముడెలా ఉన్నాడో విశ్వనాథ కల్పవృక్షంలో వర్ణించేరు.

తలపై కిరీట రత్నములకు మారుగా
  తల్లి యుంచిన యక్షతల వ్రజంబు
మొగముపై కస్తురి బొట్టుకు మారుగా
  ఆ తల్లి యిడిన విభూతిరేఖ
బాహువులను బాజుబందులు బదులుగా
  తూలు చుండిన వ్రతతోరణంబు

అలికంబు నప్రదృష్యత్వంబు బదులుగా
శాంత సౌలభ్య ప్రసన్నతయును
తోప, పార్శ్వచరులు తోపక, వెల్లని
గొడుగు లేక....

పట్టాభిషేకానికి సిద్ధమవవలసిన రాకుమారుడు వనవాసానికి సన్నద్ధమయ్యాడు. ఆయన ఏవిధంగా శాంతము, ప్రసన్నత కలిగియున్నాడో ఆయన వెంట వెళుతున్న సీతా లక్ష్మణులు కూడా అలాగే ఉన్నారు. వాల్మీకి అందుకే అన్నాడు –

ఆరురోహ రథం సీతా ప్రథమం హృష్టమానసా ।
తతస్తు తం రథం రామః అపి ఆరురోహ సలక్ష్మణః ॥

మొదట సంతోషభరితమైన మనసుతో సీత రథం ఎక్కింది. తరువాత రామలక్ష్మణులు రథాన్ని ఆరోహించేరు. శ్రీరాముడు సరయూ నది ఒడ్డున ఉన్న వన ప్రదేశాలను చూచి, అటు తిరిగి సాకేతపురం అంటే అయోధ్యను చూచి నమస్కరించి ఇలా అన్నాడు –

సరయూ కాననరమ్య దేశ మృగయా సంతోషముంబాయ, దా
దర మెక్కెను జుమి, నాదుగుండెకని, అంతన్ తాను సాకేతపుం
పురికిన్ నిల్చుచు నాభిముఖ్యముగ రాముండిట్లనెన్ - 'తల్లి ఓ
పురి, నిన్ వీడెద నమ్మ ! నాదుకైమోడ్పుల్ వీని గైకోగదే !'

(రామాయణ కల్పవృక్షం)

అయోధ్యకు నమస్కరించి గంగ ఒడ్డుకు చేరేడు. అక్కడనించి అంత వరకు రథం తోలుకు వచ్చిన సుమంత్రుడు వారినక్కడ దింపి వెనుకకు వెళ్లి పోయేడు. ఆ ప్రాంతం నిషాదరాజయిన గుహుని సామ్రాజ్యం. అతడు శ్రీరాముని భక్తుడు. సీతా లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు వచ్చేడన్న వార్త విని పరుగు పరుగున వచ్చేడు - అర్ఘ్యపాద్యాలిచ్చేడు. ఇచ్చి –

ఏమి అతిథి వచ్చె నింటికి ! నారాజ్య
మెల్ల నీది. నీకు ఏమి ఏమి

వలయు నవ్వి యవ్వి వాడుకో శ్రీరామ !
ఏమి చెలిమికాడొ యీవు నాకు !

(రామాయణ కల్పవృక్షం)

అన్నాడు.

శ్రీరాముడు గంగ దాటడానికి గుహుని నావ ఎక్కబోయేడు. ఇక్కడ ఈ సందర్భంలో మొల్ల రామాయణంలో ఆ పరమ భక్తాగ్రగణ్య అయిన మొల్ల ఒక చక్కని పద్యం వ్రాసింది. గుహుడంటాడు - ఓ శ్రీరామా ! నీ పాదాలు సోకిన ఒక రాయి స్త్రీగా మారిందట. అందుచేత నీ పాద ధూళి తగిలి నా నావ ఏమవుతుందో ఏమో ! అంచేత ముందు నీ కాళ్లు కడగనీ అని శ్రీరామ చరణారవిందాలను కడిగేడు గుహుడు –

"సుడిగొని రామ పాదములు సోకిన ధూళి వహించి రాయి ఏ
ర్పడ నొక కాంత అయ్యెనట ! పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడవడి నోడసోక నిది ఏమగునో" అని సంశయాత్ముడై
కడిగె గుహుండు రామపద కంజ యుగంబు భయమ్ము పెంపునన్

ఇలాగే తులసీదాసు కూడా గుహునిచేత రామ పాద పద్మాలు కడిగించేడు. ఒక ఇద్దరు మహాభక్తులకు గుహునిచేత ఈ పవిత్రమైన పని చేయించడంలో ఒకే రకమైన భావన ఎలా కలిగిందో కదా !

ఆ విధంగా సీతారామలక్ష్మణులు గంగ ఇద్దరినించి అద్దరికి వెళ్లేరు. అదే వాల్మీకి అంటాడు –

తౌతు తేరుః తతో గంగాం నావా గుహసహాయతః ।
గంగాయా దక్షిణం తీరం ప్రాప్యతౌ వివిశుః వనం ॥

గంగ దక్షిణాన ఉన్న వనాలలో ప్రవేశించారు. ఆ ప్రాంతంలో ఋష్యశృంగుడు, శాంత ఉంటారు. వారిని దర్శించి మరల ప్రయాణం కొనసాగించేరు. త్రివేణీ సంగమం చేరుకున్నారు. అంటే ఇప్పటి అలహాబాదు పట్టణం - ప్రయోగ.

యత్ర భాగీరథీం గంగాం యమునా అభిప్రవర్తతే ।
జగ్ముః తం దేశ ముద్దిశ్య విగాహ్య సుమహద్వనం ॥

వనాలు దాటి గంగా యమునా సంగమం చేరుకున్నారు.

అక్కడికి కొంచెం దూరంలో భరద్వాజ ముని ఆశ్రమం ఉంది. అక్కడికి వెళ్లి సీతా లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు భరద్వాజునికి నమస్కరించేడు.

రామస్తు ఆశ్రమ మాసాద్య త్రాసయన్ మృగపక్షిణః ।
నత్వా ముహూర్తమధ్యానం భరద్వాజముపాగమత్ ॥
రామః సౌమిత్రిణాసార్ధం సీతయాచ అభ్యవాదయత్ ।

భరద్వాజాశ్రమంలో సేదదీరి ఆ ముని ఆతిథ్యాన్ని స్వీకరించి ఆయన ఆజ్ఞననుసరించి అక్కడినించి చిత్రకూటానికి చేరుకున్నారు. భరద్వాజ ముని శ్రీరామునితో ఇలా అన్నాడు –

మధుమూల ఫలోపేతం చిత్రకూటం ప్రజేతిహి ।
వాస మౌపయికం మన్యే తవ రామ మహాబల ! ॥

తీయని పండ్లతో నివాసయోగ్యమైన ప్రదేశం చిత్రకూటం అని చెప్పిన భరద్వాజుడు శ్రీరాముని మహాబల ! అని సంబోధించేడు. అంటే ఇక్కడినించి శ్రీరాముని బలం అవసరమయ్యే పరిస్థితులు ఏర్పడతాయి అని సూచన. శ్రీరాముడు ఫలాని చోటికి వెళ్లాలి అని ఒక ముని ఏల చెప్పాలి ? అంటే దీని వెనుక ఒక దైవసంకల్పం, ఒక గొప్ప కార్యం ఉన్నాయి అని తెలుసుకోవాలి.

ఎండ కన్నెరుగని సీత, పురుషులకు కూడ మోహం కలిగించే రూపం గల శ్రీరాముడు, అతిసుందరుడైన లక్ష్మణుడు అలా అడవుల వెంటపడి వెళుతుంటే తులసీదాసు కవి హృదయం ద్రవించింది. ఆయన అంటాడు వాళ్లు ఎండకి కందిపోకుండా వాళ్ల తలపైన మేఘాలు గొడుగులై వారివెంట వెళ్తున్నాయట !

జహ జహ జాహి దేవ రఘురాయా
తహ తహ మేఘ కరహి నభఛాయా

అడవులు దాటి, పర్వతాలు దాటి, నదులు దాటి వెళ్లి వెళ్లి శ్రీరాముడు ఒకచోట ఆగేడు. తమ్ముడు లక్ష్మణునితో అన్నాడు –

శ్రీరాముండును అంత తమ్ముగని, లక్ష్మి ! ఈ వనంబున్ పయః
పారీభూతము, సాధునిర్ఝర పరీపాకంబు నానా లతా
రారాజత్ఫలబుద్ధి, మూలఖని, సుత్రాణంబు, జంతువ్రతా
వారామంబు, నివాసయోగ్యమిట నున్నం జాలు నిక్కంబుగన్

(రామాయణ కల్పవృక్షం)

విశ్వనాథ వారు శ్రీరామునిచే లక్ష్మణుని 'లక్ష్మి !' అని ముద్దుగా పిలిపించేరు. 'ఇది నానారకాల లతలతో ఫలాలతో నిండి ఉంది ఇక్కడుందాం' అన్నాడు శ్రీరాముడు.

అదేమాట వాల్మీకి చెప్పేడు.

నానా నగగణోపేతః కిన్నరోరగ సేవితః ।
పుణ్యశ్చ రమణీయశ్చ బహుమూల ఫలాయుతః ॥

కొండలు, కోనలు ఉన్నాయి. కిన్నరగణాలున్నారు. అందంగా ఉంది. కందమూలలు పళ్లు సమృద్ధిగా ఉన్నాయి - అని. ఈ నాటికీ ఆ చిత్రకూట పర్వతం ఒక పవిత్ర పుణ్యస్థలంగా భక్తుల మనస్సులో నిలిచి ఉంది. ఆ పర్వతం చుట్టూ ప్రదక్షిణ చేస్తారు యాత్రికులు. శ్రీరాముడు చిత్రకూటానికి వచ్చి ఆశ్రమం ఏర్పరచుకుని మందాకినీ నదీ తీరాన ఇక్కడ ఇలా ఉండగా, అక్కడ భరతుడు తనకు రాజ్యం వద్దన్నాడు. ఇది శ్రీరామ చంద్రునికే దక్కాలి అన్నాడు. మంత్రులు ఎంత ప్రార్థించినా పట్టాభిషేకం చేసుకోడానికి, సింహాసనం మీద కూర్చోడానికి అంగీకరించనే లేదు. ఆ మాటే వాల్మీకి ఇలా చేప్పేడు –

రాజ్యం నైచ్ఛత్తు భరతః మంత్రిభిః ప్రార్థితోపిసన్ ।
ఆదిశత్ రామమానేతుం సేనా సన్నహ్యతాం ఇతి. ॥

ససైన్యంగా, మంత్రీజనంతో సహా భరతుడు చిత్రకూటానికి వెళ్లేడు. నారచీరలు ధరించి, దర్భాసనం మీద కూర్చొని, ఆశ్రమవాసం చేస్తున్న సీతారాముల్ని చూసి భరతుడు నిలువునా కన్నీరయ్యేడు.

మన్నిమిత్తం ఇదం దుఃఖం ప్రాప్తోరామః సుఖోచితః ।
ధిక్ జీవితం నృశంసస్య మమలోక విగర్హితమ్ ॥

ఇత్యేవం విలపన్ దీనః ప్రస్విన్న ముఖపంకజః ।
పాదౌ అప్రాప్య రామస్య పపాత భరతః రుదన్ ॥

'అహెూ! నా వలన కదా సుఖముల సుభవించ దగిన శ్రీరాముడు ఇలా ఉన్నాడు. నా జీవితం ఎందుకు?' అని విలపిస్తూ రాముని పాదాలపై పడి వలవల ఏడ్చాడు భరతుడు. విశ్వనాథవారు రామాయణ కల్ప వృక్షంలో ఆ సన్నివేశాన్ని ఇలా చిత్రించారు.

తలడబ్బాటుగ రామచంద్రపదపద్మం బందునం గొట్టుకో
నిల సాష్టాంగముగా బడెన్ కనులనీళ్ళైళ్ల,....

అలా పాదాలపై పడి కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తున్న భరతుని శ్రీరాముడు బాహువులతో ఎత్తి గ్రుచ్చి కౌగలించుకొని తలపై ముద్దాడేడట!

భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా ।
ఆఘ్రాయ రామః తం మూర్ధ్ని పరిష్వజ్యచ రాఘవః ॥

అని చెప్పేడు వాల్మీకి. అదిగో ఆ శ్రీరామ భరతుల పరిష్వంగం జరిగిన ప్రదేశం ఈనాటికీ యాత్రీకులు వెళ్లి చూసి వస్తుంటారు.

పాపం శ్రీరామునికి అంతవరకు తండ్రి దశరథుని మరణ వార్త తెలియదు. పెద్దకొడుకు కదా! తండ్రికి ఆ మందాకిని నదిలో తర్పణం విడిచేడు శ్రీరాముడు.

ప్రగృహచ మహీపాలః జలపూరితం అంజలిం ।
తతః మందాకినీ తీరం ప్రత్యుత్తీర్య స రాఘవః ॥
పితుః చకార తేజస్వీ నివాసం భ్రాతృభిః సహ ।

అన్నదమ్ములతో కలిసి తండ్రికి తర్పణం విడిచేడు శ్రీరాముడు. తరువాత భరతునికి తన పాదుకలనిచ్చి తిరిగి అయోధ్యకు పంపేడు. తండ్రికిచ్చిన మాట ప్రకారం పధ్నాలుగేళ్లు వనవాసం చేసి తిరిగొస్తానని మాట ఇచ్చేడు.

రామోపి ప్రదదౌ ప్రీత్యా భరతాయ స్వ పాదుకే ।
గృహీత్వా పాదుకౌ భక్త్యా ప్రతస్థే భరతః పురీం ॥

రాముడు ప్రేమతో భరతునికి పాదుకలిచ్చేడు. భరతుడు భక్తితో ఆ పాదుకలను గ్రహించి నగరోన్ముఖుడై వెళ్లేడు. ఇది మన సంస్కృతి. అన్న పాదుకలను నెత్తిన బెట్టుకుని, అతని పాదుకలనే సింహాసనం పై ఉంచి, అతని పేరనే రాజ్యం చేసిన ఒక అపురూపమైన సోదరుడు భరతుడు. రాజ్యంకోసం అన్నదమ్ములనే సంహరించే సంస్కృతి కాదు మనది.

అలా భరతుడు వెళ్లగానే తండ్రికి తర్పణం విడిచిన చిత్రకూటాన్ని వదిలి శ్రీరాముడు దక్షిణ దిశగా బయలుదేరాడు. వెళ్లి వెళ్లి వారు పరమ పవిత్రులైన అత్రి అనసూయల ఆశ్రమాన్ని చేరుకున్నారు.

సః అత్రేరాశ్రమమాసాద్య తం మహాయశః
తం చాపి భగవాన్ అత్రిః పుత్రవత్ ప్రత్యపద్యత

అత్రి అనసూయలకు ప్రణమిల్లిన ఆ సీతారామ లక్ష్మణులను అత్రి అనసూయలు ఆశీర్వదించి వారిని తమ పిల్లలవలె చూసుకున్నారు. అనసూయ మహా పతివ్రత. ఆమె పేరే చాలా గొప్పది. అనసూయ అంటే అసూయ లేనిది. ఒక స్త్రీ గొప్పదవటానికి అంతకు మించిన లక్షణం ఏముంటుంది ? సీత వంటి సాధ్వికి అనసూయ పసుపు కుంకుమలిచ్చింది. బట్టలు పెట్టింది. ఆభరణాలిచ్చింది. ఆ సంఘటన ఒక అపూర్వమైన సంఘటన. అది వాల్మీకి ఇలా వర్ణించేడు.

ఇదం దివ్యం వరం మాల్యం వస్త్రమాభరణానిచ ।
అంగరాగంచ వైదేహి మహార్హమను లేపనం ॥
మయా దత్తం ఇదం సీతే తవ గాత్రాణి శోభయేత్ ।

ఈ సన్నివేశాన్ని విశ్వనాథవారు ఇలాగే చిత్రీకరించేరు.

ఇద్ది మైపూత ఇదిగంధ మిద్ది చీర
ఇద్ది పూమాల ఇవియు తల్లీ ! మదీయ
సత్తపః కల్పితమ్ములు సాధుశీల
వీని గైచేసికొనవమ్మ వినయరాశి !

ఈ పూమాలయు వాడదు
మైపూతయు జిలుగు సెడదు, మధురాపాంగ '

శ్రీ పాలిత లజ్జా ! నీ
ఏపు చెడదు, చీర నలుగదే ! నా తల్లీ ! (కల్పవృక్షం)

అని చెప్పింది అనసూయ. ఇది ఈమె ఇప్పుడామెకు ఎందుకిచ్చినట్లు ? అది దేవరహస్యం. సీత ఏడాదిపాటు రావణుని లంకలో ఎండకు వానకు లోనై ఉండాలి. మరి ఈ ఏడాదిపాటు ఆమె పూమాల వాడకూడదు. శరీరపు వన్నె తరగకూడదు, ఏపు చెడకూడదు, చీర నలుగరాదు. అందుకనే ఇవన్నీ ఆమె కిచ్చినది అనసూయ. ఈ నాటికీ అత్రి అనసూయల ఆశ్రమ ప్రాంతంలో పసుపు కుంకుమలు అమ్ముతూ ఉంటారు. ఆ అత్రి అనసూయల ఆశ్రమం విడిచి రామచంద్రుడు మరల వనాలలో ప్రవేశించి దండకారణ్యం వైపు బయలుదేరేడు. ఇక్కడ అగస్త్యుని సందర్శించేడు. అగస్త్యుల వారు శ్రీరామునికి రామరావణ యుద్ధానికి ముందు ఆదిత్య హృదయం ఉపదేశించిన మహాముని.

అగస్త్యులవారు శ్రీరాముని పంచవటికి వెళ్లమని ఆజ్ఞాపించేరు.

ఇతో ద్వియోజనే తాత బహుమూల ఫలోదకః ।
దేశో బహుమృగః శ్రీమాన్ పంచవట్యభివిశ్రుతః ॥

'నాయనా ! ఇక్కడి నించి రెండు యోజనాల దూరంలో కంద మూలలతో, పళ్లతో, నీటితో, మృగాలతో వాసయోగ్యమైన ప్రదేశం ఒకటి ఉంది. దాని పేరు పంచవటి. అక్కడికి వెళ్లు' అని చెప్పేడు అగస్త్యుడు. ఐదు వటవృక్షాలున్న ప్రదేశం కనుక దానికి పంచవటి అని పేరు.

ఇక్కడ మృగాలు ఉంటాయి అని చెప్పడంలో రాముడు బంగారు లేడిని చంపవలసి వస్తుందన్న ధ్వని గోచరిస్తుంది.

ఆ పంచవటి ప్రవేశించి ఆశ్రమం నిర్మించి అందులో ఉన్నారు సీతారామలక్ష్మణులు. అది గోదావరి తీరం. ఇక్కడినించే రాక్షసుల బాధ ప్రారంభం అయింది. ముందుగా వచ్చినది శూర్పణఖ. ఆమె పేరులోనే ఉంది ఆమె సౌందర్య లక్షణం. శూర్పం అంటే చేట. నఖ మనగా గోరు. చేటలంత గోళ్లు కలది శూర్పణఖ. రావణుని చెల్లెలు.

ఆమె ఎలా వచ్చిందో కంబరామాయణంలో తమిళంలో ఎంతో సుందరంగా వర్ణించేడు కంబన్. ఒక సుందరమైన రూపం ధరించి 'కామ వల్లి' అనే పేరుతో వయ్యారంగా ప్రవేశించింది. ఒక హంసలా, కోకిలలా, తీగలా వచ్చిందట !

పంజి ఒళిర్ వింజు కుళిర్ ప్పల్లవం అనుంగ
చెంజెవియ కంజనిమిర్ సీరడియళ్ ఆగి
అంజోల్ ఇళమంగై యెన అన్నమెన మిన్నుం
వంజియెన నంజమెన వంజమగళ్ వన్దాళ్

అన్నాడు కంబ మహాకవి.

ఆమె ముక్కు చెవులు కోసేడు లక్ష్మణుడు. ఈ నాటికీ ఆ ప్రదేశంలో ఆ ఘట్టాన్ని వివరించే శిల్పాలున్నాయి.

ఉధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసే మహాబల :

అన్నాడు వాల్మీకి. ఖడ్గంతో ఆమె ముక్కు చెవులు కోసేడని భావం. తర్వాత అక్కడనే ఖరదూషణాదులతో యుద్ధం జరిగింది. ఖరునికి శ్రీరామచంద్రుని రూపం అత్యంత సౌందర్యరాశిగా తోచింది. ఆ మాటే తులసీదాసు రామచరిత మానస్‌లో ఇలా వర్ణించేడు.

హమ భరి జనమ, సునహుసబ భాయీ
దేఖే నహి అసి సుందరతాయీ
జద్యపి భగినీ కిన్హీ కురూపా
వధలాయక నహి పురుష అనూపా

'సోదరా! విన్నానేమో గాని జీవితంలో ఇంతటి సౌందర్యం ఎక్కడా చూడలేదు. మన సోదరిని వికృతంగా చేసినా ఇతని అనుపమానమైన సౌందర్యం చూస్తూ ఉంటే చంపడానికి చేతులు రావడం లేదన్నాడు'.

ఈ ప్రాంతంలో శ్రీరాముడుండగానే మాయలేడి రూపంలో మారీచుడు వచ్చేడు. రావణుడు సీతాపహరణం చేసిందీ ఇక్కడే. వాల్మీకంలో రోహిణిని బుధగ్రహం గ్రహణం చేసినట్లు రావణుడు సీతను అపహరించేడంటాడు వాల్మీకి.

అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః ।
జగ్రాహ రావణః సీతాం బుధః ఖే రోహిణీమివ ॥

ఈ సన్నివేశాన్నే విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షంలో ఇలా వర్ణించేరు.

దశకంఠు చేతులు ధరణిజాహస్త
జలజాతముల పదిజతలైనగాజు
లందున నొక్క అయమ భద్రపరుప
గాజులు చిట్లి తత్కరములు పెట్లి
నెత్రు కారుచు ధారుణీ సుతకెంతొ
నొవ్వైన సీతాతనూ స్పర్శ దైత్య
కరతలంబున యందు కానట్టి స్థితికి
తల్లి సంతోషించె తామనస్సునను....

పరపురుష స్పర్శ పొందకుండా ఆమె పదిజతలగాజులు ఆపేయట! రావణుడు ఆమెను రథమెక్కించుకొని దక్షిణాభిముఖంగా వెళ్లేడు. శ్రీరాముడు సీతకోసం ఆ కొండకోనలలో వెతికి వెతికి కిష్కింధకు వచ్చేడు. కిష్కింధ ఇప్పటి హంపీ విజయనగర ప్రాంతం. వారు ఋష్యమూక పర్వతం వైపు వెళ్లేరు. అక్కడనే ఇప్పటికీ హనుమంతుని జన్మస్థలం, రాముడు వాలిని వధించిన చోటు ఉన్నాయి. ఋష్యమూకానికి వెళ్తూ రాముడు లక్ష్మణునితో అంటాడు -

ప్రాణములు నాకు తేలిక పడియె సుంత।
ఋష్యమూకాభి ముఖమయి యెసగె మనసు॥

- అని

అలా అనేటప్పటికి వారికి హనుమంతుడు కనిపించేడు. కనిపించి

తతః స హనుమాన్ వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా।
వినీతవదుపాగమ్య రాఘవౌ ప్రణిపత్యచ ॥

రామలక్ష్మణులను సమీపించి మనోజ్ఞమైన మాటలతో వారి నలరింపజేయగల హనుమ వారికి నమస్కరించేడు. తన గురించి ఇలా చెప్పుకున్నాడు -

అంజనాదేవి నాతల్లి యతడు తండ్రి
అనిల దేవుని వరమున నైతి నేను
వాయుదేవుడు నాతండ్రి వాయు దేవు
డెంత వాడొ నిజంబు నేనంత వాడ

(రామాయణ కల్పవృక్షం)

అని చెప్పి

'అస్మాత్ రాజా సుగ్రీవః యువాభ్యాం సఖ్యమిచ్ఛతి' అన్నాడు. మా రాజయిన సుగ్రీవుడు మీ స్నేహాన్ని కోరుతున్నాడు, అని వారిని తోడ్కొని సుగ్రీవుని దగ్గరకు తీసుకొని వెళ్లేడు. ఈ పర్వతం మీదనే సీత ఆకాశం లోంచి వెళ్తూ నగలు జారవిడిచింది. సుగ్రీవుడా నగలు తెచ్చి శ్రీరామునికి చూపించేడు. కన్నీటి పొరల మధ్య శ్రీరాముడానగలు సరిగా చూడనైనా చూడలేక లక్ష్మణుని చూసి 'ఇవి మీ వదిన నగలేమో చెప్పు' అన్నాడు. ఇక్కడ లక్ష్మణుని శీలాన్ని పరాకాష్టకు ఎత్తుకొనిపోయే ఒక్క చక్కని శ్లోకం వ్రాసేడు వాల్మీకి. శ్రీమద్రామాయణంలోనే ఇది ఒక అపురూపమైన శ్లోకం. లక్ష్మణుడంటాడు - 'నా కామె కేయూరాలు, కంకణాలు తెలీవు, నిత్యం పాదాలకు నమస్కరిస్తాను గనుక ఆమె అందెలివి అని మాత్రం తెలుసు' అని -

నాహం జనామి కేయూరే
నాహం జనామి కంకణే
నూపురే త్వభి జనామి
నిత్యం పాదాభివందనాత్

అది ఈ సంస్కృతిలో వదినపై మరిదికున్న మర్యాద. తరువాత వాలి వధ జరిగింది. ఆ వధ జరిగిన చోటు ఈనాటికీ హంపీ వద్ద యాత్రికులు దర్శిస్తూంటారు.

తెలుగులో ఉన్న సర్వసాహిత్యంలోను ఉత్తమోత్తమమైన గ్రంథం 'భాగవతం'. పోతనగారు భక్తి పారవశ్యంతో వ్రాసిన గ్రంథం. ఇందులో నవమస్కంధంలో వారు శ్రీరాముని చరిత్ర వ్రాసేరు. అందులో వాలి వధను ఇలా వర్ణించేరు పోతనగారు -

కం. లీలన్ రామవిభుండొక
కోలం గూలంగనేసె గురునయశాలిన్
శీలిన్ సేవిత శూలిన్
మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్

(భాగవతం - 9వ స్కంధం - 273)

అక్కడికి నించి ఇంకొంచెం దక్షిణంగా వస్తే దాదాపు కన్యాకుమారి దగ్గర గంధమాదన పర్వతం ఉంది. ఇక్కడే సుగ్రీవుడు వానర సైన్యాన్ని సమకూర్చి శ్రీరామునికి వప్పజెప్పేడు.

ఏతే వానర ముఖ్యాశ్చ శతశః శత్రుసూదన ॥
ప్రాప్తశ్చ ఆదాయ బలినః పృథివ్యాం సర్వవానరాన్ ॥

భూమ్మీద ఉన్న వానర యోధుల్నందర్నీ ఇక్కడ సమావేశ పరిచేను అన్నాడు సుగ్రీవుడు. వీళ్లు కేవలం వీరులు మాత్రమే కాదు, కామరూపం మొదలైన విద్యలెరిగిన వారు.

సైన్యంబీయఖిలంబు దోః పటువు నీ స్వాధీన మందుంచితిన్
వన్యావాసము, సర్వ పర్వత దరీవాసంబు, అంభోధితీ
రన్యస్తంబును, కామరూపమును, శౌర్య ప్రక్రియాఖండమున్
వాన్య ప్రాభవ మాక్షిపద్గిరి వితవానేక దోః కేలియన్

(రా. కల్పవృక్షం)

వీరితో బాటు వీరెరిగిన విద్యలు కూడా నీచేత పెడుతున్నాను అన్నాడు సుగ్రీవుడు.

ఆ గంధమాదన పర్వతానికి దగ్గరలో కోదండరామాలయం ఉంది. అక్కడ రాములవారి పాదపద్మాల ముద్రలున్నాయి. ఇక్కడనే విభీషణుడు శ్రీరాముని శరణు కోరేడు.

అవధారు ! శ్రీరామచంద్ర ! అసురరాజైన మాయన్న
అవమానపరచి నన్నంపె ! అతడు నీకంతిష్టమైన
తవిలి ఆతనితోడ చావు, తరలిపో ! దనుజాపశదుడ
అవుర ! నీమోము చూపకుముా ఇటు వంచును తనకు.

నిను శరణు పొందుచుంటిని
కానకాని నను నమ్ము చారికుడ కాను ప్రభూ !
నను స్వీకరింపు దయనం
చును కపితతి మోములందు జూచుచు నిలువన్

(రా. కల్పవృక్షం)

'నీకంతడంటే అంతిష్టం అయితే అతనితోనే చావు పో నీమొఖం నాకు చూపించకు' అని మా అన్న నన్ను అవమానించి వెడలగొట్టేడు, నిన్ను శరణు కోరుతున్నాను. నేనేదో గుఢాచారిని అనుకోకు - అన్నాడు విభీషణుడు.

వాల్మీకి ఈ విషయం ఇలా చెప్పేడు -

ముందు విభీషణుడు తనను తాను పరిచయం చేసుకున్నాడు.

రావణోనామ దుర్వృత్తంః రాక్షసః రాక్షసేశ్వరః ।
తస్యాహం ఆనుజః భ్రాతా విభీషణ ఇతిశ్రుతః ॥

రావణుడనే రాక్షసరాజు దుష్టుడు, అతను మా అన్న. అతని తమ్ముణ్ణి నేను. విభీషణుడంటారు.

తరువాత శరణు కోరేడు.

భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణం గతః ॥
పరిత్యక్తా మయా లంకా మిత్రాణిచ ధనానిచ ।
భవద్గతం మే రాజ్యంచ జీవితంచ సుఖానిచ ॥

నీవు సర్వభూతములకు శరణు పొందదగిన వాడవు. నేను నీశరణు కోరుతున్నాను. లంక వదిలిపెట్టేను. మిత్రులను, ధనాన్ని వదిలివేసేను. నా రాజ్యం, నా జీవితం, నా సుఖం సర్వస్వం ఇక నీకు చెందినవే అన్నాడు.

ఆ తరువాత రాముడు త్రోవ ఇమ్మని సముద్రుని ప్రార్థించేడు. సముద్రుడాతని ప్రార్థన వినలేదు. శ్రీరాముడు కోపంతో బాణం సంధించే సరికి సముద్రుడతని ముందు చేతులు మోడ్చి నిల్చుని ఇలా అన్నాడట !

ఓ కాకుత్స్థ కులేశ ! ఓ గుణనిధీ ! ఓ దీనమందార ! నే
నీ కోపంబున కెంతవాడ జడధిన్, నీవేమి భూరాజవే
లోకాధీశుడ వాది నాయకుడ వీ లోకంబులెల్లప్పుడున్
నీ కుక్షిం ప్రభవించుచుండు, నడుగన్ నిక్కంబు సర్వాత్మకా !

కట్టుము సేతువు లంకం
జుట్టుము నీ బాణవహ్ని సురవైరి తలల్
గొట్టుము నేలంబడ, జే
పట్టుము నీయబల నధికభాగ్య ప్రభలన్

(భాగవతం - నవమస్కంధం)

'నాయనా ! శ్రీరామ చంద్రా ! నీ కోపం నా వంటి అల్పునిపై దేనికి ? నువ్వు లోకాధీశుడివి. లంకకు సేతువు నిర్మించి నీ శత్రువులను సంహరించి నీ భార్యను చేపట్టు' అన్నాడు సముద్రుడు.

అప్పుడు శ్రీరాముడు –

**తతః సాగర వేలాయాం ధర్భా వాస్తీర్య రాఘవః ।**
**అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశయే మహోదధిం ॥**

శ్రీరాముడు తూర్పుగా దర్భలపై కూర్చొని నమస్కరించి సముద్రానికి వారధి కట్టడానికి ఉపక్రమించేడు. ఇక్కడే శివుని పూజించి శివలింగ ప్రతిష్ఠ చేసేడు. అదే శ్రీరామలింగేశ్వరునిగా రామేశ్వరంగా ప్రసిద్ధి పొందిన స్థలం.

వారధి దాటి లంకలో ప్రవేశించి యుద్ధంలో రావణుని సంహరించేడు. ఇక్కడ వాల్మీకి రామ రావణ యుద్ధాని వర్ణిస్తూ ఒక చక్కని శ్లోకం చెప్పేడు. ఒక వస్తువును మరిదేనితోనూ సరిపోల్చ లేకపోతే దానిని దానితోనే సరిపోలుస్తారు. అది అనన్వయాలంకారం. ఆకాశం ఎలా ఉంటుంది! ఆకాశంలా ఉంటుంది. సముద్రం ఎలా ఉంటుంది? సముద్రంలా ఉంటుంది. రామ రావణ యుద్ధం ఎలా ఉందంటే రామ రావణ యూద్ధంలా ఉందట!

గగనం గగనాకారం సాగరం సాగరోపమః ।
రామ రావణ యోర్యుద్ధం రామ రావణయోరివ ॥

రామ రావణ యుద్ధం తరువాత విభీషణునికి పట్టాభిషేకం చేసి అగ్ని పునీత అయిన సీతను తీసుకొని శ్రీరాముడు పుష్పకవిమానంలో బయలుదేరి తిరిగి నందిగ్రామం వచ్చి భరతునితో సహా అయోధ్యకు వెళ్లేడు –

**తతః పుష్పకం కామగమం విమానం ।**
**ఉపస్థితం భూధర సంనికాశం ॥**

అంటాడు వాల్మీకి. ఎక్కడికి కావాలని అనుకుంటే అక్కడికి వెళ్లేది, కొండంత పెద్దది అయిన విమానంలో వెళ్లేడు శ్రీరాముడు. తరువాత శ్రీరాముని పట్టాభిషేకం జరిగింది –

**కోరి వశిష్ఠ హస్తగత కుంభ సముద్రనదీ మహాంబువుల్**
**ధారగ రామ మూర్ధకలి తాల్ప జటాగుహలన్ స్రవింప జా**
**డారతి నీలలోహిత జటావనులందువ జొచ్చుచున్న భా**
**గీరథివా జనెన్ కృతయుగీనము ధర్మము వాస్స్వ రూపమై**

(రామాయణ కల్పవృక్షం)

వివిధ నదుల నుండి తెచ్చిన నీరు రామునిపై అభిషేకిస్తూ ఉంటే శివుడు తలనుండి జారిన గంగలా అనిపించిందట. అది కృతయుగ ధర్మ మేమో అనిపించిందట. వాల్మీకి ఇదే విషయాన్నిలా చెప్పాడు.

తతః సప్రయతో వృద్ధః
వశిష్ఠః బ్రాహ్మణైః సహ
రామం రత్నమయే పీఠే
సహ సీతం న్యవేదయత్

వశిష్ఠుడు సీతారాములను రత్నసింహాసనంపై నుంచి పెద్దలు, బ్రాహ్మణుల ఆశీస్సుల నందించేడట.

ఇది చదివితే, వింటే ఈ రామ పాదయాత్ర చూస్తే ఏమౌతుంది ? అంటే వాల్మీకి చెప్తున్నాడు –

కుటుంబ వృద్ధిం ధన ధాన్య వృద్ధిం
స్త్రియశ్చ ముఖ్యాం సుఖముత్తమంచ
శ్రుత్వా శుభం కావ్యమిదం మహార్థం
ప్రాప్నోతి సర్వాం భువిచ అర్థ సిద్ధిమ్

ఆయుష్యం ఆరోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం శుభంచ
శ్రోతవ్యమేతన్నియమేన సద్భిః
ఆఖ్యానం ఓజస్కరం వృద్ధికామైః

ఇది వినినవారికి కుటుంబము, ధనధాన్యములు వృద్ధి చెందుతాయి, సుఖం కలుగుతుంది, ఆయుష్షు, ఆరోగ్యం, బుద్ధి, శుభాలు కలుగుతాయి. వృద్ధి కోరేవారికిది ఓజస్సు నిస్తుంది.

శ్రీ రామ పాదయాత్రాఖ్యం ఇదం చిత్రకథా మృతమ్ ।
దృష్ట్వా భవతి కల్యాణం శ్రుత్వా సుఖమనుత్తమమ్ ॥

శ్రీరామ పాదయాత్ర అనే ఈ చిత్రములతో కూడిన కథ చూసిన వారికి శుభాలు కలుగుతాయి, విన్నవారికి చదివిన వారికి సుఖాలు కలుగుతాయి.

మంగళ కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

---



శ్రీరామ పట్టాభిషేకం

రచయిత :
డా. పప్పు వేణుగోపాలరావు

ప్రకాశకులు :
భాగవత తత్త్వ ప్రచార సమితి, కడప